కాలములో నవ్యసాహిత్యాని కొంత చక్కని భవిష్యత్తు ఉన్నదనే ఆశ పొడముతున్నది. ప్రాతవాళ్లు సాహిత్యరంగములో కాలూనినిలువద్రొక్కుకొంటూ, రాబోయే రచయితల కుత్సాహము చేకూరుస్తూ ఉండడము గమనింపదగినది. అలాంటివారిలో సాహితీ సమితీయులెన్నదగినవారు కూడాను. వీరు రసవాదులు. ఉక్తిలో - భావములో నవ్యత నుద్దేశించినవారు. విశ్వనాథ, నోరిగడుసుబారుతున్నారు.

కవితాసమితీయులు (విశాఖపట్నం) సాధనచేస్తూ ఆశ కల్పిస్తున్నారు. మారేపల్లివారి (కవిగారు) ప్రభావ మూసమితిలో యువకులను ప్రాచీన కవితామార్గమును దూషించే రచనలను చేయనీకుండ' చేసినది. శ్రీరంగం శ్రీనివాసరావు, పురిపండా అప్పలస్వామి, వర్ఘుల కాళిదాసు, పూడిపెద్ది వెంకట రమణయ్య మొదలైన వారు వీరిలో కొందరు. నవ్యసాహిత్య పరిషత్తు వచ్చి స్వేచ్ఛకు చక్కని అవకాశమిచ్చినది అనవలె. మొదట్లో చాలకాలము శివశంకరశాస్త్రిగారి వంటి పండితుని చేతిలో ఉండి నవ్యసాహిత్య పరిషత్తు అమంగళ కరములు, జుగుప్సా కరములు కాని రసవద్రచనలను ప్రోత్సహిస్తూ వచ్చినట్లు కన్పిస్తుంది. తెలికిచర్ల వారి కార్యనిర్వహణ దీక్షా, తల్లావఝ్ఝలవారి సహృదయత్వమూ, అనేక యువకవుల్ని ఆకర్షించి నవ్యసాహిత్య పరిషత్సభ్యులను, అభిమానులను చేసినవి. వావిలాల సోమయాజులు, పిలకా గణపతిశాస్త్రి, శివరామం, పన్యాల రంగనాథరావు, పాప, రజని, మల్లవరపు, పట్టికొండ రంగయ్య, దేశిరాజు కృష్ణశర్మ, పిఠాపురం యువరాజా, మొదలైన వాళ్ళనేకులు సాధకులు బయలుదేరినారు. వీళ్ళవలన కొంత నవ్యసాహిత్యసృష్టి జరిగినది. తుమ్మల సీతారామమూర్తి చౌదరి, జాషువా, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి, దుర్భాక రాజశేఖరశతావధాని, సురవరం ప్రతాపరెడ్డి, గరికిపాటి మల్లావధానులు, పంగనామముల రామచంద్రరావు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మ మొదలైన వారనేకులు ఏసంస్థలద్వారా కాక విడిగా కవితాసాధనచేస్తూ ఇతరులలో ఆయాప్రాంతాలలో

ఉత్సాహాన్ని కల్పిస్తూ ఎంతో కృషిచేసి నవ్యసాహిత్య వృక్షాన్ని ఫలవంతము చేసినారు.

సాధన సమితీయులు (సికింద్రాబాదులో) సాధనచేస్తూ నవ్య చైతన్యాన్ని కల్పిస్తూ వచ్చినారు. వారిలో పిల్లలమఱ్ఱి వెంకట హనుమంతరావు, జమ్మలమడక సూర్యప్రకాశరావు, రాజలింగం, భాగీ నారాయణమూర్తి, భండారు చంద్రమౌళీశ్వరరావు, బూర్గుల రంగనాథరావు, నెల్లూరి కేశవస్వామి, దేవులపల్లి రామానుజరావు మొదలైన సాధకులాశకల్పిస్తున్నారు.

అప్పుడే ఒకప్రక్క నుంచి రెండవ ప్రపంచయుద్ధ మేఘము దట్టముగా క్రమ్ముకొని వస్తున్నది; కాలవైపరీత్యమే సాహిత్యాల లోనూ, ప్రతిబింబిస్తుందన్నట్లు నవ్యాంధ్రసాహిత్యములో నూతన సూత్రాలపైన రచనల్ని సాగించడము ప్రారంభమైనది; కొంతవిప్లవ దృష్టిప్రబలడము మొదలు పెట్టినది; స్వేచ్ఛ-స్వాతంత్ర్యము నేపథ్యాలపై దృష్టి కేంద్రీకృతమైనది; శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు గారల రచనలు వెనుకటి నవ్యమార్గానికి భిన్నాలై అతినవ్య చైతన్యాన్ని లోకములో కలుగజేస్తున్నవి. జలసూత్రము రుక్మిణీనాథశాస్త్రిగారు స్థిరపడిన నవ్యుల కవిత్వంపైనా, క్రొత్తగా వచ్చిన అతినవ్యుల ధోరణిపైనా పారడీలువ్రాస్తూ కొంతచైతన్యాన్ని కలుగజేస్తున్నాడు. వెనుకటిదానిపైన అసంతృప్తి, ముందును గూర్చినఅనిర్దిష్టతా, ఏర్పడినవి. సందిగ్ధవాతావరణము పెరిగిపోతున్నది.

రాజకీయాలలోని విభిన్నమతాలు సాహిత్యములోకూడా ప్రతిబింబించడము ప్రారంభమైనవి. ఆ ప్రకారముగా నవ్యసాహిత్యము నవ్యాతినవ్య పథముల నడుస్తూ వచ్చినది.

ఏఏ నూతన మార్గాలు సాహిత్యములో ఏర్పడినవో వానికర్త లెవరో వానివాని ప్రభావము లెలాంటివో, అనుయాయులుగా ఎవరె వరెలా కృషిచేసినారో, సంప్రదాయ సంస్కృతుల నిలువద్రొక్కే ప్రయత్నమెలా ఒకప్రక్క జరుగుతూ వచ్చినదో, మొదలైన విషయాలను విపులముగా రాబోయే భాగములో పరిశీలిద్దాము.

V. Ramana & Co., M-10-10-1956, Rs 3/-/-